# ఆశీస్సు

మా భట్టారము మల్లికార్జును సుధ
ర్మా కావ్య కళ్యాణి న
వ్యాభన్ శోభిలుచున్ రసజ్ఞజన చి
త్తా కర్షణోత్కర్ష రే
ఖా భాస్వత్ కమనీయ వైఖరు లెసం
గన్ వర్ధిలున్ గాత భా
షా భామామణి యాంతరంగిక వయ
స్యా శ్రేణిలో రాణియై.

'సాహిత్యరత్న'
మోచర్ల రామకృష్ణకవి

# తొలిపలుకు

'కవిసమ్రాట్'
శ్రీ విశ్వనాథ సత్యనారాయణ

నేటి ఆంధ్రదేశమున సంప్రదాయసిద్ధమైన తెలుఁగు పద్యరచన— పొంపులేనిది, ధారాశుద్ధికలది, మాధుర్యగుణము ప్రధానముగా కలది, వ్యాకృతభాషాలక్షణము పాటించునది, సంస్కృతము తల్లి బాస యనుకొనునది, దాని కలయిక చేత భాష భూషిత మగు ననుకొన్నది, పూర్వకవుల సమాస గ్రథనపద్ధతియందు మిక్కిలి యాదరము కలది, దాని ననుస రించునది— చేయఁగలవారు పెక్కుమంది కలరు. ఎందుచేతనో, సంప్రదాయమును దిగఁద్రొక్కిన వారికి వచ్చిన కీర్తి వీరికి వచ్చుట లేదు. ఇట్టి చక్కని రచన చేయువారు తెనుఁగునాట పలుచోట్లఁగలరు. ఒక్క నెల్లూరులోనే, నాకుఁ దెలిసినంతవఱకు, నలుఁగురైదుగు రున్నారు. వారిలో శ్రీభట్టారం మల్లికార్జున కవి యొకరు. వీరి కవితను చదివి సంతోషించెడివారిలో నే నొకఁడను.

పద్యరచనాశక్తి – కావ్యరచనాశక్తి – రెండును భిన్న ములు. రెండవది లేకపోయినను మొదటిదానికిఁ గొంత శోభ యున్నది. ఎందుచేతనో, యిట్టి పద్యరచనాశక్తి కలవా రందఱు చిన్నచిన్న కావ్యములే రచించుచున్నారు. పట్టుమని వేయి పద్యముల గ్రంథము వ్రాసినవారు వీరిలోఁ దక్కువమంది కలరు. దానికి కాలము హేతువేమో! నేఁ డభివ్యాప్తమై యున్న నాగరకతయు, ప్రశంసితమగుచున్న సాహిత్యధోరణియు

వీరికిఁ బ్రోత్సాహము నిచ్చుట లేదేమో? వీరికి ధైర్యము గలిగించుట లేదేమో? లేదా, వీరి అంతశ్శక్తి మఱికొంత దృఢము కావలయునా? వస్తువు ఆధునికము కానిచో నేఁడు ప్రశంస పడయుట కష్టముగానే యున్నది. పూర్వపద్ధతి రచనలోని మెఱుఁగులను జూచి మెచ్చుకొనువారి సంఖ్య తగ్గినది. ఈ 'సుధర్మ' యన్న గ్రంథములోనే—

'కుచ్చె ళ్లగసిన గాగర
విచ్చిన యుమ్మెత్తపూవు వితమున....'

అని వ్రాయఁబడి యున్నది. ఇందులోని సొగసు మెచ్చుకొనఁ గలశక్తి పలుమందికి నేఁడు లేనట్లున్నది. ఇదిగాక, తెలుఁగు పద్యమున యతిప్రాస లదుకుటలోఁ గల నేర్పుచేతఁ గూడ పద్యమునకు శోభవచ్చును. ఈ శోభలయం దాధునికపఠిత బుద్ధి నిదురవోవు చున్నట్లున్నది.

ఈకవి రచనలలో నిది మొదటిది గాదు. మఱియు నీ కవి పైన చెప్పఁబడిన కొన్ని యడ్డంకులను దాఁటుటకుఁ గాఁబోలు నన్నట్లు, ఆధునిక వస్తుసంగ్రహణము చేసినాఁడు. రాకెట్టును జూచి దేవతలు భయపడుట— మానవులకు దేవతలకు రాఁబోవు కయ్యమును భావించుట— దానికి కలహభోజనుఁడైన నారదుని యుబలాటము— బృహస్పతి మందలింపు— చివరకు నారదుఁడు శాంతిదూతగా మాఱి పయనించుట— ఇది కథావస్తువు. ఆధునికమైన వస్తువును స్వీకరించినంతనే, సంప్రదాయసిద్ధమైన పద్యరచనాసౌందర్యము కొంత తగ్గుట యుండును. కాని, ఈ గ్రంథములో నట్టి లోప

మెచ్చుటను జరుగలేదు. అంతియే కాదు— నారదుఁ డాధునిక భారతీయ యువకుని వేసము వేసికొన్నట్లు వర్ణిత మైనది. (181వ పద్యము)— అందులోఁగూడ నీ లోప మాసన్నము కాలేదు. దానియందు కొంత హాస్యరసము సముద్దీపించు చున్నది.

కవి తన సహజశక్తిని వర్ణనలోఁ జూపించఁ గలఁడు. అందుచేతఁ దొలుతటి ముప్పది పద్యములలోను సుధర్మ యందలి భోగములనే వర్ణించెను. అచ్చట నీ కవియొక్క శక్తి సహజముగా భాసించుచున్నది.

ఈ కవి తొలుతనే చెప్పినట్లు చక్కని భాషాజ్ఞానము కలవాఁడు. దివ్యమైన పద్యరచన చేయఁగలవాఁడు. సంప్ర దాయసిద్ధమైన యీయన పద్యరచన కుదాహరణము లెన్ని యేనిఁ జూపించవచ్చును. ఈయన యింకను మంచిగ్రంథములు వ్రాయఁగలఁడు— వ్రాసి తన శక్తికి ఉచితమైన కీర్తిని సంపా దించుకొనుగాత మని యాశించుచున్నాను.

'మహాకవి'

శ్రీ కాటూరి వేంకటేశ్వరరావు

మీ 'సుధర్మ' తుదముట్ట చదివితిని. వయసున పిన్న లయ్యును, కావ్యరచనమున మీరు ప్రోఢలు. అపారమైన శబ్దసంపద మీకు కైవసమయినది. మీ ధార నిరర్గళము—స్వచ్ఛము. మీ రెన్నుకొన్న కావ్యవస్తువు ప్రకృతకాలోపయోగియై కుతూహలం పెంచుతూ ఉంది.

నేటి సైంటిస్టులు చేసేదికూడా తపస్సే. సందేహము లేదు. విశ్వశ్రేయస్సునందు దృష్టికూడా వారికి లేకపోలేదు. దోషమంతయు నేటి పాలకులం దున్నది. పూర్వం రాక్షసుల వలె వీరును వరగర్వితులై త్రిలోకీవిజయమునకు అంగలు చాస్తున్నారు. పూర్వం తపస్వులు దర్శించిన దివ్యాస్త్రములను గూడ కొందరు విశ్వద్రోహానికై ప్రయోగించుటకద్దు. తమశ్శక్తి నారాధించే నేటి ప్రభువుల చేతిలో ఈ దివ్యాస్త్రములు పడినవి. పూర్వం అశ్వత్థామాదుల చేతిలో బ్రహ్మశిరో నామకాదులైన అస్త్రములు పడినప్పు డిట్టి యుత్పాతములే కలుగనున్నతటి పెద్దలు వారించిరి. నేడట్టి విశ్వత్రాతలు కనుపించరు. మీరుచెప్పినట్లు ఏనాటికైన మానవుని మేధ సత్త్వచోదితము కాగలిగినచో, నేటి సైంటిస్టుల తపస్సు విశ్వకళ్యాణము చేకూర్చగలదు.

మీ కావ్యం ఆ యీ ఉపదేశమును రమణీయంగా చేస్తున్నది.

---

డాక్టర్ శ్రీపాద గోపాలకృష్ణమూర్తి

శ్రీ భట్టారం మల్లికార్జునకవిగారి 'సుధర్మ' చదివినాను. చాలా సంతోషించినాను. వీరి కవిత్వానికి చక్కని ధార, అన్వయ సౌలభ్యము, చైతన్యవంతమైన పలుకుబడి, పదగుంభనసామర్థ్యము కలవు. అక్కరకురాని వర్ణనలకు పోని వినయవివేకసంపత్తి కలదు. వెతికితే అచ్చుతప్పు కానవస్తుందేమోగానీ. వ్యర్థపదము కానరాదు. వీరికృతులు రసతుందిలములు, హితసహవర్తనములు. 'సత్కవీశ్వర శుభాశీర్వాద సంభావ్యములు' నగును గాక.

*M. Ananthasayanam Ayyangar*
*(Speaker, Loksabha.)*

**NEW DELHI**
**SEPTEMBER 18TH 1960.**

*Dear Sri Mallikarjunam,*

I am very happy that I found your SUDHARMA very good and easy reading. You have exhibited in your small book a good knowledge of both Sanskrit and Telugu. There is a happy blend of both the languages. The metres are apt and appropriate to give expression to the various emotions that are depicted in the book. Description of the transformed Narada as a fashionable young man adopting the western style is very interesting. You have proved that during the present time, books can be written on current topics in easy flowing classic style.

I was doubtful until I came to the end whether Narada will be made responsible for the failure of the SUMMIT CONFERENCE. You have given us hope that he will come here with good intentions.

Though the book is small and confines itself to a single topic, I am sure that any body who reads it will find it very very interesting. I congratulate you on your enterprise and for the book that you have so well written. I hope and trust, that you and other young poets of the present generation will take up these themes and make useful contribution to Telugu literature.

I wish you all success in your future enterprise.

*Yours sincerely*
*(Sd.) M. ANANTASAYANAM.*

**P. V. RAJAMANNAR**
CHIEF JUSTICE,
MADRAS HIGH COURT

**MADRAS**
**September, 28th, 1960.**

*Dear Sir,*

I duly received your poem "SUDHARMA" ........ I find it very interesting and what more, very Original. It is in a sense a satire against the modren age of space-flights and atomic warfare.

I congratualte you on your poem.

*Yours sincerely,*
*(Sd.) P. V. RAJAMANNAR.*

# ప్రస్తావన

శ్రీ కైలాసమహీధరాగ్రమున ల
క్ష్మీనాథ వాణీధవుల్
పాకారిప్రముఖాష్టదిక్పతులు రం
భా మేనకా ద్యప్సరో
రాకాచంద్రనిభాననల్ గొలువఁ గా
రంజిల్లు న య్యర్ధ నా
ర్యాకారుం దరుణేందుశేఖరకలా
పాలంకృతుం గొల్చెదన్.

ప్రారంభించిన మామకీనకృతి ని
ష్ప్రత్యూహావర్ధిష్ణు సు
శ్రీరమ్యం బయి, సత్కవీశ్వరశుభా
శీర్వాద సంభావ్యమై
సారార్థశ్రవణీయమై పుడమి నా
చంద్రార్కమున్ నెక్కొనన్
గౌరీశంకరనందనుం దలఁతు వి
ఘ్నధ్వాంతమార్తండునిన్.

ఒక కేలన్ స్ఫటికాక్షమాలికను, వే
ఱొంటన్ శుకంబున్, దద
న్యకరాగ్రంబునఁ బుస్తకంబును, గరా
న్యాగ్రంబునం బద్మముం
బ్రకటస్ఫూర్తి ధరించు దేవతను, మ
ద్భావాభ్రవీథిన్ విపం
చిక వాయించుచు సంచరింపు మనుచున్
జేమోడ్చి యర్థించెదన్.

లోకారాధ్యులు సర్వభూతహితసు
శ్లోకుల్ రసామ్నాయవి
ద్యాకూలంకష సాహితీవన వసం
తారంభులై నట్టి వా
ల్మీకివ్యాసులఁ గొల్చెదన్, మఱియుఁ గా
ళీదాస పుంభావవా
ణీకాంతామణి నెంచెదన్ సుకవితా
నిర్వ్యాజ సంసిద్ధికై.

శిలలన్ గోడల గొందులన్ గుడులలో
జీర్ణంబులై యున్న మా
తెలుఁగుం బల్కులఁ గావ్యసూత్రమున సం
దీప్తిన్ నిబంధించి, ప

చ్ఛలహారంబుగ భారతీగళమునన్
జానొందఁ గైసేసి శే
యలఘుల్, తత్కవితాత్రిమూర్తులకు జో
హారుల్ సమర్పించెదన్.

అవలీలన్ నిజశిష్యవర్గమున క
వ్యాజానురాగంబుతోఁ
గవితామర్మము విప్పిచెప్పి రసవ
త్కావ్యప్రణేతృత్వవై
భవముం గూర్చిన సిద్ధహస్తుని, మహో
పాధ్యాయు, నద్వైతత
త్త్వవిశేషజ్ఞుని సంస్మరింతు ఘను సు
బ్రహ్మణ్యు దుర్భాన్వయున్.

నవనీతోపమ నవ్యకావ్యరచనా
నైపుణ్య సర్వాంధ్రసం
స్తవనీయప్రతిభావిశేష సుషమా
సాహిత్యరత్నంబు, మ
త్కవితాంకూర సువర్ధనప్రణయవా
త్సల్యాబ్ధి, మోచర్ల వం
శవిరాజన్మణి, రామకృష్ణ కవికిన్
సద్భక్తితో మ్రొక్కెదన్.

సాకల్యంబుగఁ గావ్యనాటకరహ
స్యప్రక్రియల్ నేర్చి ము
క్కాఁకల్ దీరిన మొక్కలీంద్రు గల యి
క్కాలంబునన్, బద్యవి
ద్యాకౌశల్యము సుంతగల్గిననె కా
వ్యంబున్ రచింపంగ నే
నాకాంక్షించితిఁ, బ్రాంశులభ్యఫలలో
భాకృష్ట కుబ్జుండనై.

'తనవాఁ డొప్పుఁడు తప్పుసేసినను క్షం
తవ్యుండు గాకుండునే'
యను న్యాయంబునఁ దప్పులుండునెడ సౌ
హార్దంబునన్ నాకుఁదె
ల్పి, ననుం దీరిచిదిద్దుఁడయ్య! కవితా
విఖ్యాతసత్సాహితీ
ఘనులారా! గయికొండు నాయవి నమ
స్కారంబులం బ్రీతులై.



# స్వధర్మ

---

ఆది అమరావతీనగర,
మంచిత నందన పుష్పసౌరభా
స్వాదన విలోల మత్తమధు
పప్రకర శ్రవణీయ గీతికా
స్పదము, వియద్ధునీ వికచ
పద్మపరాగ పిశంగితాంగస
మ్ముదిత మరాళయుగ్మ పరి
భుక్త మృణాళము, హాళిఁ గ్రాలెడిన్. 1

తళుకుల్ చిందు కడాని గోడల పయిన్
దాపించి యున్నట్టి ప
చ్చలు నీలంబులు పద్మరాగములు ని
చ్చల్ రంగుదీపంబులై
వెలయన్, వేలుపుఱేనికిన్ నిలయమై
విద్యుత్ప్రభా దీప్తమై
కల దాప్రోలున వైజయంతము కళా
కాంతా శిరోరత్నమై. 2

* * *

" వలపుల్ చిమ్మెడు కమ్మతెమ్మెరలు వీ
వఁగ సాఁగెఁ, దొల్దిక్కునన్
నలువారం దలకూఁడుచున్నయవి సం
ధ్యారాగముల్, తమ్మిపూ
వుల జాల్వాఱెడు తేనె లాని మధుపం
బుల్ సుప్రభాతోచితం
బులు మేల్కొల్పులు పాడుచుండె, ధృతగం
భోళీ! హారీ! మేలుకో!" 3

వందులు వైతాళికు లీ
చందంబున మేలుకనుపు సంగీతపుటా
నందము సంధింపఁగ, సం
క్రందనుఁ డవబోధ మొందెఁ బ్రాతర్వేళన్. 4

వలపూరన్ బిగికౌఁగిటన్ శచి కదిం
పన్, నిక్కి పొంగారు గు
బ్బల రాపిళ్లకు మేని గందవొడి సాఁ
బాల్ రాలియున్ గమ్మతా
వులు నింపన్, విడియంపుఁ గెంపుజిగి సొం
పుల్ వాతెరన్ నిండఁ, బూ
విలుకానిన్ మఱపించు చెల్వమున నొ
ప్పెన్ వేల్పుఱేఁ డత్తఱిన్. 5

పసివాళ్వాడియుఁ దావిఁ గోల్పడని దీ
వ్య న్నందనోద్యాన క
ల్ప సుమోత్తంసము జాఱఁగాఁ, బెదవిపైఁ
బల్గాట్లు రంజిల్ల, నె
న్నొసటం గస్తురిబొట్టు చెమ్మగిలి చిం
దుల్ వాఱ, సాత్వొన్మనో
జ సుమాస్త్రంబు పలెం బులోమజ విలా
సం బొప్పె నప్పట్టునన్. 6

తమ్మిపూఁ గమ్మతావులఁ జిమ్ము మిన్ను
నాక సలిలంబు స్వర్ణకుంభములఁ బట్టి
దేవదాసీజనము కొని తేఁగ, వేగుఁ
బోక చెయ్వోలు దీర్చెను నాకవిభుఁడు. 7

బాహుమూలంకష స్తనభర విలగ్న
హారి మణిహార మంటె సయ్యాట లాడు
పసిఁడి గాజుల చప్పుళ్ల పస లెసంగ
రంభ తలయంటె నపుడు పురందరునకు. 8

పారిజాతమధూళికా పరిమళంబు
లోలయఁ బన్నీట నూఱిన నలుఁగు వెట్టి
స్వాకుచముల్ స్వర్ణకలశముల్ స్పర్ధపడఁగ
జలకమాడించె నూర్వశి కులిశధరుని. 9

జిలుఁగంచుల్ గల పట్టుదోవతిని బిం
జెల్ దీరఁగాఁ గట్టి, రిం
గులు జీరాడెడు వల్లెవా టెడఁదపైఁ
గుల్కొత్తఁ గైసేసి, వే
ల్పులతేఁ డద్దము ముందు నిల్చెఁ: దిలకం
బుంబొట్టు నెమ్మోమునన్
జెలువారన్ సవరించె నప్పుడు ఘృతా
చీకాంత జంభారికిన్. 10

కచముల్ విప్పిన నెమ్మిపించె మటు సిం
గారంబుగాఁ గొప్పు దీ
రిచి, కన్గోనలఁగాటుకల్ మరుని నా
రిం బోలఁగా దిద్ది, చి
త్రి చమత్కారము పత్రభంగరచనా
ప్రావీణ్యముల్ నిండఁగా
శచిఁ గైసేసిరి మేనయున్ హరిణియున్
సౌందర్యవారాశిగాన్. 11

పురహార్మ్యాగ్రము లందు నిల్పి తలిరుం
బోణుల్ రణత్కింకిణీ
కర చామీకర రత్నకంకణ ఝణ
త్కారంబు లేపారఁ గ్రొ

వ్విరివానల్ గురియింప, వాసవుఁడు దే
వీయుక్తుఁడై వేడ్కమై
నరుదెంచెన్ వెస నోలగంబునకుఁ దా
నై రావతారూఢుఁడై. 12

అదియే సుధర్మ యనఁబడు
త్రిదివసభా మంటపంబు – దివ్యకళాకో
విదశిల్పప్రావీణ్యా
స్పద చిత్రవిచిత్రదృశ్య సంభావ్యంబున్. 13

కంబమే లేని యా కొల్వుకట్టడమున
మిసిమి పస లెసలారెడు మేలికట్ల
నడుమఁ బొదివిన మగఱాల బెడఁగు లవఘు
ళించు వినువీదిఁ దారకల్ నించు సోయలు. 14

అక్కడి గోడల మీఁదన్
బెక్కులు చిత్రింపఁబడియె వేల్పుఱేఁ డా
రక్కసులఁ గసిమసంగిన
ప్రాక్కథనంబులు సుఖాంతరమణీయంబుల్; 15

గౌరీశంకరవీర్య
శ్రీరమ్యుండైన దేవసేనాపతి యా
తారకుని సంహరించిన
నేరుపు లటఁ జూడవచ్చు నెమ్మదలిర్పన్. 16

అమృతభాండంబుఁ దెచ్చి, సురాసురులకుఁ
బంచిపెట్టంగ వచ్చి, నక్తంచరులను
మించి వంచించినట్టి యా చంచలాక్షి
వన్నెచిన్నెలు వీక్షింపవచ్చు నచట. 17

ఆ హజారంబు లోపల నర్ఘ వస్తు
లాకృతిం దీర్పఁబడియుండు నాసనముల
నడుమ విలసిల్లె మణుల చెక్కడపుఁబనులు
హరువుగాల్పెడు స్వర్ణసింహాసనంబు. 18

మునివరు లొక్కవంక, బుధ
పుంగవు లింకొకవంక, సత్తపో
ధను లొకవంకఁ, గ్రమకవి
తానిధు లింకొకవంక, నాట్యశా
స్త్రనిపుణు లొక్కవంక, లలి
తస్వర గానకళాప్రవీణు లిం
కను మఱియొక్కవంక, గుమి
గాఁ గొలువైరి సుధర్మలోపలన్. 19

యమ వరుణ కుబేరులు వ
హ్ని మరుత్తులు నైరృతుండు నీశానుండున్
సముచితమర్యాదలతో
రమణీయాసనములన్ విరాజిల్లి రటన్. 20

ఈ రాణ నెసంగు సభా
గారమునకు విలువగట్టఁగారాని యలం
కారంబై హేమించెను
స్వారాజ్యపురోహితుండు వాచస్పతి దాన్. 21

కై వారుల జయవిజయా
రావములు సెలంగు సవసరంబునఁ దమి నై
రావతమును దిగి శచితో
దేవేంద్రుఁడు లోని కరుగుదెంచెన్ శుచిన్నై. 22

కులిశధరుని రాక తెలిసి యభ్యుత్థితు
లైరి కొల్వులోనివార: లప్పుడు
జంభసూదనుండు శచితోడ నేగి బృ
హస్పతికిఁ బ్రణామ మాచరించె. 23

చరణాబ్జంబుల నంటి మ్రొక్కఁగ శచీ
సంక్రందనుల్, దివ్యని
ర్ఝరిణీ తుంగతరంగసంఘటిత మం
ద్ర ధ్వాన సంకాశ సు
స్వరవిన్యాస మహోహాదయప్రణవ వా
క్ప్రారంభసంరంభియై
గురుఁ డాశీర్వచనంబు పల్కి ముదముల్
గూర్చెన్ సదస్యాళికిన్. 24

గురు నాజ్ఞం గొని సింహాసీఠము పయిన్
గూర్చుండి రింద్రాణియున్
బురుహూతుండును, దిక్పతిప్రముఖ స
భ్యుల్ తాముఁ గూర్చుండి రా
సరసన్ స్వీయమహాసనంబుల పయిన్,
స్వారాజ్యలక్ష్మీ ముఖాం
బుజన్యస్త తమాలపత్రము వలెన్
బొల్పారెఁ గొల్వయ్యెడన్. 25

ఇరుగడల నిల్చి వింజా
మరములు వీచిరి తిలోత్తమాప్రమ్లోచల్
హారిణియును జిత్రలేఖయు
నెఱజాణలు పట్టి రప్పుడు నీరాజనముల్. 26

ఆలోకన నీలాంబుజ
మాలికలన్ విసరి సురసమాజము మీఁదన్
రోలంబాలక మేనక
హేళిం బన్నిరు సల్లె నత్యుత్సుకతన్. 27

తాళము వైచె నూర్వశి, మృ
దంగము వట్టెను జిత్రలేఖ, శం
పాలతికాంగి మేనక వి
పంచిక మీటెను, బాళిలీల నీ

లాలు కపోలదర్పణము
లన్ నటియింప శిరంబునూఁచి రా
గాలతి తోడుగా వినఁగ
హాయిగఁ బాడెను మంజుఘోషయున్. 28

ఝుళ ఝుళ మ్మని కాలి గజ్జెలు నదింప
ఘల్లు ఘల్లని కంకణక్వాణ మెసఁగ
కింగురంగని కాంచి ఘంటికలు మొఱయ
రంభ వెలి కేగుదెంచెఁ దెరం దొలంచి. 29

కుచ్చు ల్లెగసిన గాగర
విచ్చిన యుమ్మెత్తపూవు వితమున నెంతో
ముచ్చట గొలుపంగా, న
య్యచ్చర మేల్బంతి నాట్యమాడెన్ సభలోన్. 30

సకల బాహ్యేంద్రియంబుల శక్తిసంప
దలను గేంద్రీకరించి నేత్రంబు లందు
నుంచి యా నాట్యభంగి వీక్షించు సురల
యనిమిషత్వంబు సార్థకం బయ్యె నాఁడు. 31

నాకభుజంగినీ రుచిర
నాట్యసమాప్తమునం, దపూర్వ శో
భాకలితాననుం డగుచు
వజ్రధరుం డనియెన్ "సదస్యులా

రా! కలవే విశేషములు?
హాయిగ నుందురు గాదె! రాక్షసా
నీకము క్రొవ్వడంచితిని
నిర్భయులై మెలగుండు మీ రికన్. 32

కారణ మేమో గానీ
ధారుణి సంగతులు తొలివిధమ్మునఁ దెలియం
గా రావు, రాకపోకలు
నారదుఁడున్ మానెఁ గొన్ని నాళ్లుగ దివికిన్. 33

అవనీమండలవాసు లెప్పటివలెన్
యజ్ఞంబులం దీర్చుచున్
హవిరాతిథ్య మొసంగఁగా మనల నా
హ్వానించుటల్ లేదు - మా
నవు లీ నాకము రాక మానుకొని యె
న్నాళ్లో చనెన్ - వారి కీ
పావ రెక్కుం గత మేమిటో తెలిసికోఁ
బోలుం జుమీ దిక్పతుల్. 34.

అంభోదంబులఁ బంపి ధారుణిని స
స్యశ్యామలన్ జేసితిన్
దంభోళిన్ గిరిపక్షముల్ దునిమి స్వా
స్థ్యం బిచ్చితిన్, యాగసం

రంభాహ్వానము మానినా రకట! దు
ర్మార్గుల్ కృతఘ్నుల్ నరుల్
జంభారాతిని నేను మానవుల నై
ర్లక్ష్యంబు సైరింతునే?" 35

ప్రాగాశాపతి పల్కులన్ విని బృహ
ద్భానుండు దా నిట్లనెన్
'యాగంబుల్ నెఱవేర్చు టెల్లను మహేం
ద్రా! దుర్లభస్వర్గసం
భోగ ప్రాప్తికిఁగాదె - నాకవిభవం
బుల్ భోగముల్ నేఁటి యీ
భూగోళంబున నైత మున్న, సవనం
బుల్ తీర్తురా మానవుల్?' 36

పావక వాక్యముల్ విని ప్ర
భంజనుఁ డిట్లనియెన్ "సురేంద్ర! ధా
త్రీ వలయాన నిచ్చలు న
దృశ్యుఁడనై చరియింతుఁ గావునన్
నే వచియించెదన్ వినుము
నేఁ డట నుండెడి భోగభాగ్యసు
శ్రీవిభవంబు మాని సుర
సీమకు వచ్చునె యెంత వెఱ్ఱియున్. 37

అమృతం బిందు లభించు నం
చనేదవో, యచ్చోటి మద్యమ్ముతో
సమమా యియ్యది! పారిజాతసుమన
స్సౌగంధ్య మచ్చోట ల
బ్ధముగాదన్న, సువాసితాఖిల దిశాం
తంబుల్ 'మనోరంజనీ'
సుమముల్ కుప్పలుతిప్ప లెందుఁ గనిరక్
క్షోణిక్ శచీవల్లభా! 38

అచ్చరలఁ గోరి మైన రావచ్చుఁ గాదె
నాకమున కందు వేమొ! అందాలబరిణె
లందుఁ గల సుందరులు! వారి ముందు వీరు
దిగఁదుడిచి వైచుటకుఁ గూడఁ దగరు సుమ్మి. 39

దేనికై వత్తు రింక నీ త్రిదివమునకు?
నేమి కోరి యొనర్తురు హోమములను?
జన్మములు మానవులు సేయకున్న, మీకుఁ
గూటికే కాటకం బటే కుధరవైరి!" 40

మారుతుఁ డిట్లనఁగ, సునా
సీరుం డింకేదియో వచింపఁగఁ బోవన్
వారించి, సురగురుం డీ
తీరున సదసద్వివేకధీనిధి పలికెన్. 41

"లోకము నాకనిభం బని
మీ కేటికి మచ్చరంబు? మృత్యుంజయహే-
వాకధురంధరులము మన
కాఁకలిదప్పులకు నేల యాచకవృత్తుల్? 42

పుడమి యంతయు స్వర్గమై పోయె ననిన
సంతసంపడవలయు నస్వప్నులెల్లఁ
బరుల మేలు సహింపని పాడుగుణమె
యలవడిన, నాక మకమయం బౌను గాదె?" 43

ఈ చందంబునఁ దనరిన
వాచస్పతి పల్కు భరతవాక్యం బయ్యెఁ
బ్రాచీదిగధీశసభా
ప్రాచుర్య సదస్యనైక వాఙ్ముఖములకున్. 44

వైజయంతంబున శచీబిడౌజు లిష్ట
మృష్టభోజనతుష్టులై మించు వేడ్క
నందనోద్యాన విహరణానందులైరి
సరవి రవి గ్రుంకెఁ జరమాద్రి దరుల యందు. 45

తారకాకిలికించిత తన్మయుండు
ఆకసంబునఁ దోఁచె సుధాకరుండు
కమ్మతెమ్మెరకౌదములు క్రమ్ముకొనియె
జుమ్ముజుమ్మనె నళి కుముదమ్ము నంటి. 46

కూర్మి మీఱంగ నొప్పులకుప్ప లగుచుఁ
బడుకటింటికిఁ బోయి రయ్యెడ శచీ పు
రందరులు వైజయంత హర్మ్యంబు నందు
వర్ణనాతీత మచ్చోటి వైభవంబు. 47

కామశాస్త్రోక్తబంధ లక్ష్యంబు లట్లు
రంగయుల నేరుపులకుఁ దార్కాణములుగఁ
జిత్తముల బందిగొనియెడి చిత్తరువులు
కలవు శయ్యాగృహంబుగోడల సమృద్ధి. 48

వనమునఁ దపస్సమాధిలో మునిఁగియున్న
గాధిసుతునిఁ దపోభ్రష్టుఁగా నొనర్పఁ
దలఁచి వచ్చిన వేలుపుందలిరుఁబోఁడి
సురతవైయాత్యముల నటఁ జూడ వచ్చు. 49

శుకుని సన్నిధి సువ్యక్త సకల గోప
నీయ రమ్యాంగకములతో నిట్టవోడుచు
రంభ - కుచభరజితశాతకుంభకుంభ -
కాండపటమున నొకచోటఁ గానిపించు. 50

సనశోభాంచిత సారసౌరభ లస
న్మందాకినీ వీచికా
ప్లవమానాంబుజ డోలికాస్థిత మరా
ళద్వంద్వమట్లై, శచీ

దివిషన్నాథు లభంగురప్రణయవా
ర్ధిం దేలి యోలాడుచున్
గప్పఁగిళ్లం బడి నిద్రవోయిరి రతి
క్లాంతాంగరాగాన్వితై. 51

రేయి నడుమంత్ర మయ్యెను
'హా! యయ్యో! భయము! పీడ! అయ్యయ్యో! అ
మ్మో!' యని శచి యఱచెను – 'దే
వీ! యేమిటి?' యనుచు లేచె వేల్పుఱేఁడున్. 52

'నను రేఁ దాఁకెను – మును పె
న్నఁడు లేదే యింత దారుణనినాదం – బె
క్కడిదో యిది?' యని గడగడ
వడఁకుచు నింద్రాణి దిగులుపడుచున్ లేచెన్. 53

'కను బెట్టిదమై, చెవికిం
బిమ్మగై, యీ ఘోరరవము వినఁబడు – నెవ్వం
డొడిగట్టెనో దివికిఁ హా
వడి గలిగింపంగ?' నంచు వజ్రియు నులికెన్. 54

'వడివడి నినుమడియై యలి
కిడి వినఁబడు చుండె – నెట్టి కీ డగునో? రా
యిడికాం డ్రెవరో?' యని యిం
ద్రుఁడు తడఁబడుచుండ, రేయి తుది జామయ్యెన్. 55

'గంగాభంగతరంగఘూర్ణనమె యగాఁ,
గాకున్న నైరావతా
భంగస్ఫూర్జితబృంహితంబె యగులే
వామాక్షి!' యం చెన్ని యో
భంగుల్ పల్కె నెలంతఁ దేర్చుటకునై
పాకారి యత్నించు చుం
డంగాఁ, జల్చెఁ బజెన్ దిశాంతరములన్
దామిస్ర సంఘాతముల్. 56

'ఈ వింగడ మే మగునో
దేవగురుం గలిసికొన్నఁ దేటపడున్ - దే
వీ! వెఱ పేలా నీకున్?
గ్రావ గరుద్భేది నైన కాంతుఁడ నుండన్!' 57

అని పల్కి నముచిదమనుఁడు
సనియెన్ స్వారాజ్యగురుని సదనమునకు: న
య్యానఘుం డావేళకె తాఁ
జనియెం జదలేటిదరికి సాంధ్యవిధులకై. 58

గురుచంద్రుని యిల్లా లీ
సరణిన్ గురుఁ డింటలేని చందము దెలుపన్
బిరబిర లేఖర్షభుఁడున్
వఱువాతకు మున్న మిన్నువాకకుఁ జేరెన్. 59

స్వర్ణదీపవిత్ర సలిలంబులం గ్రుంకి
యంజలించి, రవికి నర్ఘ్యమిచ్చి
త్రిదశ దేశికుడు 'హరిః ఓమ్' మ్మనుచు దరిన్
నిలిచి శ్రుతిహితముగఁ బలుకు నపుడు. 60

'ప్రొద్దు వొడిచెనో లేదో, కొల్వునకు గానో
యేల నా కొలఁకకై యిట్టి వేళ నిటకు
వచ్చెనో వజ్రధరుఁ' డని తెచ్చవోయి
'కుశలమే వత్స!' యనియెను గురువరుండు. 61

జాగ్రదరుణిమ కన్నుల సందడింప
గద్గదస్వర మేర్పడఁ, గడచి చనిన
నాఁటి కాఁదాఁదిమాఁదారి చేటు తెలఁగుఁ
దడఁబడుచు నిట్లుసెప్పె వృద్ధశ్రవుండు. 62

"హరి చక్రాయుధ విక్రమంబు, భవదీ
యాశీర్బలం, బప్సర
స్తరుణీ మానిమనోవశీకరణ వై
శారద్యమున్, ధారుణీ
ధరపక్షప్రళయక్షమంబయిన నా
దంభోళియుం గూడి ని
ర్జరలోకంబున కే యుపద్రవములున్
రాకుండ రక్షించెఁగా. 63

అయినన్ నిన్నఁటి రేయి నుండి గురువ
ర్యా! వైజయంతంబునన్
శయనింపం జనినంత, నూర్ధ్వ ముఖమై
శబ్దం బదేదో శ్రవో
న్మాయకాలంబయి యుత్కటంబయి సమీ
పంబై వినన్ వచ్చెడిన్
లయవేళా స్తనితాకృతిన్ బహుళమై
క్లబ్యాను సంధాయినై. 64

తొలుదొల్తన్ వినినప్పు డా నినదముం
ద్యోలోకకూలంకషా
చలదుత్తుంగతరంగ సంఘటిత ని
స్వానంబో, నిర్భిన్నగం
డ లస ద్దాననిషక్త భృంగచయ పీ
డాక్రుద్ధమాద్య ద్విశ్వం
ఖల దిక్కుంజర బృంహితారభటియో
గా వచ్చు నం చెంచితిన్. 65

అవిరామంబుగ నంతకంతకును డా
యన్ వచ్చు నీ శబ్దమున్
దివిషద్ద్వీపవతీతరంగరవమో
దిఙ్నాగఘీంకారమో

యప్రసంచుం దలపోయు టెట్లు? సురరా
జ్యశ్రీజిగీషారతిన్
బవరంబుం దలపెట్టు రక్కసుల దు
ర్వ్యాపార మై యుండునా?" 66

అని వాచస్పతితో సురేశ్వరుఁడు దీ
నాలాపముల్ పల్కుచుం
డఁ, నభోవీథి వినంబడెన్ విపుల వీ
ణా వాదనక్వాణః సు
భ్రనదీపద్మ సుగంధబంధుర సమీ
రవ్యాప్తమై, విష్ణు కీ
ర్తనపీయూషరసప్రసారసముదా
రశ్రీకళాలోలమై. 67

వత్స! వాసవ! నీ చెవిం బడిన యట్టి
యా నినాదంబు వింటిని నేను గూడ
కారణం బెట్టిదే నగుఁ గాక, యింత
మాత్రమున కింతగా భయంపడఁగ నేల? 68

కర్ణపేయ మైన గానంబు వింటిమి,
మహతి మీటు దివ్యమౌని యిటకుఁ
దరలి వచ్చుచుండుఁ: ద్రైలోక్యగామి యా
తం డెఱుంగ నట్టి దుండఁ బోదు. 69

నీవు వినిన ఘోర నిర్హ్రాద మెట్టిదో
ఆ మహానుభావు నడుగ వచ్చు
దనుజు లమరపురికి దండెత్తుటే యైన
హరికిఁ జెప్పిపంప నతఁడె కలఁడు. 70

దిగులుపడుట మాని దేవేంద్ర! దిక్పతు
లందఱును సుధర్మ యందుఁ గొల్వు
దీరి యుండుఁ డేను దేవర్షి కెదు రేగి
స్వాగతంబు పల్కి సభకుఁ దెత్తు." 71

* * *

అని గురుండు పల్క, నాఖండలుం డేగి
కొలువుదీరె దిక్పతులను బిలిచి :
అర్ఘ్యపాద్యసత్క్రియా పురస్సరముగ
దేశికుండు సభకుఁ దెచ్చె మునిని. 72

మేలిమి ముత్తియంపుజిగి
మేనిపయిం దులకింపఁగా, జటా
పాళి పిశంగదీధితులు
పై నెసలారఁగ, మానసహ్రదాం
భోలసమాన కోకనద
పుష్పరజః పరికీర్ణ పక్షమై
హేళిఁ జరించు హంస మటు
ల మ్మునినాథుఁడు పొల్చెఁ గొల్వునన్. 73

తమతమ పీఠముల్ డిగి స
దస్యులు చేతులుమోడ్చి మ్రొక్కుచున్
నమిత శిరస్కులైరి ముని
నాథుని చెంగటః నంతటన్ శచీ
రమణుని ప్రార్థనంబున వి
రాజితచారుసువర్ణసింహ పీ
ఠముల నలంకరించి రచ
టన్ సురదేశికుఁడున్ మునీంద్రుఁడున్. 74

మునివరు లనుమతిఁ గొని యా
సనముల నుపవిష్టులైరి సభ్యులుః సంక్రం
దనుఁ డంతట నారదునిం
గని యిట్లని పల్కె భక్తిగౌరవ మెసఁగన్. 75

పరమతపోధనా! సురల
పై దయదప్పితి రేమొ! కాక ని
ర్జరు లెవరేని మీకు నప
చార మొనర్చిరే? లేక యీ పురం
దరుఁ డెప్పుడేని ధర్మ్మమును
దప్పి చరించెనే? యిన్నినాళ్లుగా
దరిసెన మీయకుంటిరి గ
దా! క్షమియింపుఁడు తప్పు లుండినన్. 76

లోకత్రయ సంచారులు
మీకుం దెలియంగరాని మేలుం గీడుల్
నాకంబును బొరయవు - మీ
రాక శుభావహము త్రిదశరాజ్యేందిరకున్. 77

నారదమౌనిపుంగవ! వి
నంబడుచుండెను రాత్రి రంతియున్
దారుణమైన యొక్క నిన
దం - బది యంతకు నంత కెక్కుడై
చేసువ యూచు నుండు నెడఁ
జిత్తము జల్లుమనున్ - ద్రిలోకసం
చారు లదేమిటో యెఱుఁగఁ
జాలిన వారలు మీర లెక్కరే! 78

సోఁకుమూఁకలు దండెత్తి నాకపురికిఁ
బోరునకు నేగుదెంచెడు పూన్కినైనఁ
జక్రధరున కెఱింగించి సత్వరముగ
మమ్ము రక్షింప వలయు నో మౌనివర్య." 79

సింహికాపుత్ర పీడిత శీతరశ్మి
పగిది వదనంబు వెలవెలఁబాఱుచుండ
నెలుఁగు రాల్పడఁ బల్కు దేవేంద్రుఁ గాంచి
బ్రహ్మమానసపుత్రుండు పలికె నిట్లు. 80

"ఏమని చెప్పవచ్చుఁ ద్రిద
శేశ్వర ! చెడ్డదినాలు వచ్చె న
య్యా ! మును పెల్లవేళల వి
యచ్చరలోకముఁ జేరవచ్చి మీ
సేమము లెన్నుచున్ శుభమె
చెప్పుచు నుండుదు - నట్టి నోటితో
నే మిముఁ గూర్చి యీ యశుభ
మెట్లు వచింతు నటంచుఁ గుందుదున్. 81

గరళభయంబె మైన శితి
కంఠుఁడు తీర్పఁ గలండు - యామినీ
చరభయ మయ్యెనేని ముర
సంహరు పాలికిఁ బోఁ జనుం - దప
శ్చరభయమైనఁ దీర్చుటకుఁ
జాలుఁ గదా మనరంభ ! ధారుణీ
ధరభయమైన నున్నది గ
దా కులిశంబు భవత్కరంబునన్. 82

కల్పవృక్షప్రసూనసౌగంధ్యపూర్ణ
మైన యీ నందనోద్యాన మకట ! యింక
మట్టికుండలలోఁ బూడ్చిపెట్టి నట్టి
చెట్లతో నిండు కాలంబు చేరు వయ్యె. 83

పావనంబైన గంగాస్రవంతిలోన
హరి హరీ! వాఁకొనంగ లేనయ్య! నరులు
కాళ్లుసేతులు కడిగిన కలుషజలము
కాలువలు గట్టి ప్రవహించు కాల మయ్యె. 84

జాలి సుంతేని లేక లాఁడాలు గొట్టి
రెండు చక్రాలు గూర్చిన బండిఁ గట్టి
పరుగులిడకున్నఁ గొరడాల బాదుచుండ
సైఁచునే నిక్కువీనులజక్కి? శక్ర! 85

నాల్గు దంతాల యేనుఁగో నముచిదమన!
యింకమీఁదట దూలాల నెత్తవలయు
బిగువు సడలని యీ రంభ బింక మేది
చూలుదాల్పంగ వలసిన వేళ వచ్చె." 86

తడబడు మాటల నిటు ప
ల్కెడు వీణామునిని గాంచి గీష్పతి యనియెన్
"జడదారిరాయ! మా కీ
యిడుమలు గలుగంగ హేతు వెఱిఁగింపఁ దగున్. 87

గిరి కాదంటివి - నక్తం
చరులను గాదంటివే! విషము గాదు - తపో
నిరతులనుం గాదంటివె!
మఱి యీ కడగండ్లవెట్లు మాకుం గలుగున్?" 88

అనిన వాచస్పతిని గాంచి మునివరుండు
పలికె నిట్లని మఱల : సుపర్వులకును
గుండె దడదడలాడె, నెన్నండు లేని
చెమట దిగజాఱెఁ గాల్వలై చెక్కిళులను. 89

"దేవగురుఁడ ! నీకుఁ దెలియని దేమిటి ?
కారణంబు సెప్ప నోరు రాదు
చావువార్త లెల్లఁ జల్లఁగా విన్పింప
నగు నటంచు పెద్ద లనుట వినవె ! 90

ఇఁక సావధానమతులై
సకలంబు వచింతు వినుఁడు : 'శబ్దం బేదో
నికటంబున వినవచ్చెడుఁ
బ్రకటంబుగ' నంచు వజ్రి పల్కెను గాదే. 91

ఈ నినదంబు పుట్టుటకు
హేతువు సెప్పెద నాలకింపుఁడీ!
యే నొకకొన్నినాళ్లక్రిత
మెప్పటియట్ల ముకుందసత్కథా
గానపరుండనై యరుగు
కాలమునన్, వినినాఁడ నుత్కట
ధ్వానము చంద్రలోక సవి
ధమ్మునఁ : గాంచితి సారమేయమున్. 92

రిక్క జేని కడకుఁ గుక్క యే చందాన
వచ్చె నంచుఁ దొలుత విచ్చవోయి
బహుళజంతుజాలభాషావిదుఁడఁ గానఁ
దెగువసేసి యడిగితిని మహేంద్ర! 93

‘ఓ భవకాన్వాయమణి!
యో సుగుణమ్ములరాశి! సారమే
యా! భవదాగమంబున వి
హాయస మయ్యెను పావనంబు: నీ
వే భువనంబు లందుఁ జరి
యించుచు నుండెడి వాఁడవో! దిదృ
క్షాభిరతిఁ జగత్త్రయ వి
హారము సల్పుచు వచ్చినాఁడవా! 94

సత్యలోకనివాసిని – జలజనాభ
పౌత్రుఁడను – బ్రహ్మమానసపుత్రకుఁడను –
బరమభాగవతుండ – దేవర్షివరుఁడ –
నారదుఁడ – గానవిద్యావిశారదుండ. 95

పుడమిపై నెన్నఁడో మిమ్ముఁ బోలినట్టి
వారలను జూచియుండిన కారణమునఁ
గులము గోత్రము నడుగకే తెలిసికొంటి
నేల వచ్చితిరో యానతీయుఁ' డంటి. 96

స్వీయభాషాజనప్రీతి చేత నేము
తొలఁక నాడించి, నా కాళ్లు నాక వచ్చి
పరమవిశ్వాసభావంబు నెఱుకపఱిచి
వేఁపి వచియించె నీ రీతి వేల్పులార! 97

'మధ్యమలోకవర్తనుఁడ
మానికులోత్తమ! నిత్యనవ్యశా
స్త్రాధ్యయనప్రయోగ కుశ
లాత్ములు మానవు లొక్కపెట్టునన్
సాధ్యమె యానొ కాదొ యను
సంశయమున్ విడి సేయుసేఁతలన్
భాధ్యుఁడనైతి నేను - దొలి
బాముఁనఁ జేసిన పాప మెట్టిదో? 98

స్వార్థపరాయణత్వమున
శాస్త్రవిశారదు లయ్యుఁ, దత్ప్రయో
గార్థములన్ స్వకీయజన
హానికి భీతిలి, మమ్ముబోంట్ల న
త్యర్థము గాసిపెట్టెదు ద
యారహితుల్ మనుజుల్ - పరస్పర
స్పర్ధలతో వివేక పరి
పాకము వ్యర్థమొనర్తు రక్కటా. 99

శంసాపాత్రులు శాస్త్రవేత్తలు ప్రజా
సౌఖ్యంబె వాంఛించిరన్
హింసాలంపటులైన నాయకమణుల్
హేవాకమున్ లోకవి
ధ్వంసప్రక్రియకే విధించెదరు ని
ర్దాక్షిణ్యులై : వారితో
సంసర్గంబు దొలంగె నేఁటి, కదియే
చాలున్ దపోమండనా!' 100

అని శునకంబు తాను తుహి
నాంశు సమీపము నెట్లు చేరెనో
మనుజు లొనర్చు యత్నముల
మర్మము లెట్టివో నాకుఁ దెల్పఁగన్
విని వెఱఁగొంది, యింకపయి
వేల్పుల కెట్టి విపత్తు గల్గునో
యనుకొని, కాలయాపనము
హానికరంబని యెంచి, పల్కితిన్. 101

'కుక్కురవంశమండనమ!
క్షోణీతలంబును జేర నీ మదిన్
గోర్కి జనించె నేని, నిను
గూడియె 'నే నరుదెంతు, ర' మ్మనన్

'దర్కము సేయ నొల్లను, గృ
తఘ్నులు మానవు, లట్టివారి సం
పర్కము సైఁపఁజాల' నని
శ్వానము సాఁగిలి మ్రొక్కె నయ్యెడన్. 102

కారణజన్మమే మొ శున
కం బది! మ్రొక్కిన మాత్రనే తనూ
భారము నుజ్జగించి యప
వర్గము నందెఁ; గళేబరం బనూ
పారమునన్ నశించుట నె
వండు నెఱుంగక, 'చంద్రలోకమే
చేరెనా! చచ్చెనో! యెచటఁ
జిక్కెనా!' యందురు నేఁటికిన్ నరుల్. 103

అంతట నే నధోముఖుఁడ
నై పయనించి, మహామహీతల
ప్రాంతము నందు నిల్చి, హిమ
వద్గిరిశృంగమునందు సంతత
ధ్వాంతపరీవృతం బయిన
తావున నొక్క విశాలగహ్వరా
భ్యంతరమందు డాఁచితి వి
పంచికయున్ సురపుష్పదామమున్. 104

ద్వాపరయుగంబునఁ ద్వారకాపురంబు
నందు మా తాత యైన ముకుందుఁ డున్న
నాఁడు భూలోకమున కేగు వాఁడఁ గానఁ
బూర్వపరిచిత మనుకొంటి బుద్ధిమాలి. 105

ద్వారక లేదు, కన్పడదు
పద్మదళాక్షుని కొల్వుకూటు, మె
వ్వారలనైనఁ బిల్చి 'కల
భాషిణియున్ మణికంధరుండు నే
తీరున నుందురో' యనిన
దిక్కులు సూచుచు వెక్కిరించి 'యా
సూరనయే యెఱుంగు' నను
చుఁ వచియింతు రదేమి చిత్రమో! 106

అరుణశిరోవేష్టనులఁ
గరధృతకాష్ఠుల్ పిశంగకంచుకధారుల్
ధరణీతలగత యమకిం
కర సన్నిభు లచటి రక్షకభటప్రముఖుల్. 107

తైలంబు లేక నిత్యము వెల్గు దీపాలు
మీట నొక్కినఁ బెట్టె పాటఁ బాడు
నొకచోటఁ బల్క నింకొకచోట విన్పించు
నీడలే తెరలపై నాడుఁ బాడు

అణువు బ్రహ్మాండమై యుద్భాసఁ గన్పట్టు
సూదులతో మేనుఁ జొచ్చు మందు
జంతువుల్ లాగకే శకటముల్ పర్వెత్తుఁ
బసులతోఁ బనిలేక పాలు గల్గు 108

మగల మొగమేనిఁ జూడని ముగుదలైన
మాతృతాగౌరవం బంది మలయఁ గలరు
నైకపరిభుక్తలగు చిగురాకుఁ బోండ్లు
కన్నియలు గాని కాలంబు గడపఁ గలరు! 109

అనిదంపూర్వము లిట్టి చిత్రము లసం
ఖ్యాకంబులం గాంచినాఁ
డను భూలోకము నందుఁ: జెప్పుటకుఁ గూ
డన్ శక్తుఁడన్ గాను: కా
దని వర్ణించిన, మీరు తల్లడిలుచే
యాఁగాని, రాఁబోవు కీ
డును మాన్పంగలవాఁడు మీ కిట నెవం
డున్ లేఁడు వాస్తోష్పతీ! 110

అలనాఁ డంగనరూపుఁ దాల్చి కను లా
శ్చర్యాకరంబుగా గీటి దై
త్యుల మోహాంబుధి ముంచి మీ కొసఁగెఁ బీ
యూషంబు: నేఁ డట్టి యా

టలు భూమండల శాస్త్రపారగుల ప
ట్లన్ గడ్డగట్టింపఁగా
జలజాతేక్షణు నంతవాని కయినన్
శక్యంబు గాకుండెడున్ 111

ఆకాశాంచల వీథులంటుచు విమా
నారూఢులై మానవుల్
లోకాంతంబులు చుట్టివత్తురు పవ
ళ్ళున్ రేలు : కయ్యాలకున్
ఢీకొన్నన్ బరమాణు సంఘటిత శౌం
డీర్య ప్రయోగోగ్ర హేలా
ద్రేకోదగ్రులు లెక్కసేయరు మురా
రిన్ జక్రమున్ గిక్రమున్ 112

అశ్రుతాద్భుతయంత్ర వైయాత్యనిధులు
కొండకొన లెక్కి మున్నీటి గుట్టు చెఱిచి
నేల నాల్గంచులం బయనించి ఖచర
గోళములలోఁ బ్రవేశింపఁ గోరినారు. 113

బెట్టిదులైన మానవుల
వేలుపు భంగము లుప్పతిల్లినన్
బట్టిన పట్టు వీడక శు-
భం-బశుభంబు గణింపక కెట్టి యి

కృట్టులకైన నోర్చి, శున
కంబును లోపలఁబెట్టి యొక్క రా
కెట్టును బంపినారు పరి
కింపఁగ నెంచి నభోరహస్యముల్. 114

కరముల్ చల్లని వెల్గు లీను ననుచున్
గాంక్షించినానో, ప్రియా
విరహాగ్నిం గనలించు దుష్టుఁ డనుచున్
వేధింపఁగా నెంచిరో!
గురువిద్రోహి యటంచు నైకగతులన్
గోపించిరో మానవుల్
గుఱిగావించిరి యీ ప్రయోగములకున్
గోకారి నాఖండలా! 115

పలు వన్నియల పూల వలపుల్ గుబాళించు
నుద్యానసీమల నుద్గమించి
సొగసుకత్తియల వాల్జూపుఁ గ్రొందూఁపుల
కాకరంబులు మేడ లధిగమించి
తొలిమబ్బుఁ గని పించెములు విప్పి నెమిళుల్ న
టించు కొండలకోనల్ మించిపోయి
మిహిరాంశుపటలోకిమ్మీరితంబగు మొయిల్
తెరువు దాఁటి యదృశ్య సరణి నెగసి

రోదసీగర్భమం దనిరుద్ధవేగ
చక్రవిభ్రమణంబున శబ్దమాత్ర
వేద్య మైనట్టి రాకెట్టు విధము నాఁటి
పత్రికలలోన ప్రకటింపఁ బడుటఁ గంటి. 116

అతివేగంబునఁ జంద్రమండలము చా
యం బర్వ రాకెట్టు చి
త్రితమై యుండెను బత్రికాముఖమునన్
దేవేంద్ర! యా తీరు సం
స్మృతికిం దెచ్చెను గ్రమ్మరన్ మును సుధా
స్వీకారకాంక్షన్ రయో
ద్ధతవృత్తిన్ వినువీథి నంటిన గరు
త్మద్భీకరాకారమున్. 117

కనుమాపుల్ ప్రసరించు మేర గడవం
గన్ మానవుల్ దూర ద
ర్శన యంత్రంబులఁ జూచుచుండి రఁట యా
రాకెట్టు : నా వెన్క ప
భ్ర నిరుద్ధేశ్యులై ధ్వనిగ్రహణ యం
త్రంబుల్ ప్రయోగించి త
న్నినదంబున్ వినిరంట కొన్ని దినముల్
నిర్ణిద్రకర్ణంబులన్. 118

తొలి ప్రయత్న మెట్లు ఫలియించునో యని
సంశయించినట్టి శాస్త్రవేత్త
లక్కటికము మాని కుక్కను బంధించి
పెట్టి రంతరిక్షవీధి యందు. 119

ఆత్మహానికై భయంపడి పరులకుఁ
గీడు నెంచునట్టి కితవు లకట!
చంద్రలోక మేగు సాహసం బుండిన
వారె యరుగరాదె? శ్వానమేల? 120

మెడకు గొలుసు చుట్టి, కుడువఁగా నొక్కింత
యోగిరంబు నచట నుంచి రంట
మన్ను మిన్ను గాని తెన్నున భీతిల్లి
కూడుమాని కుక్క కుయ్యి వెట్టె. 121

శాస్త్రవిదులు ప్రసారశబ్దగ్రహణసాధ
నముల విని తదార్తనాదములను
'చంద్రలోక మేగి శ్వానంబు పెఱవారిఁ
గాంచి యఱచె' నని తలంచి రంట. 122

గింగురాలు పెట్టు బొంగరంబున్ బోలె
భూనభోఽంతరాళమున భ్రమించి
యిందుమండలమున కించుక క్రిందుగా
భగ్నమయ్యె నరుల పరికరంబు. 123

మిత్తిఁ దప్పి సారమేయంబు వ్రేలాడు
చుండె వాయుశూన్యమండలమునఁ
జిరతపోఽంకురిత వసిష్ఠ విశ్వామిత్ర
శక్తిసంపదలఁ ద్రిశంకు నట్లు. 124

'మంచు వెలుంగు లోకమున
మర్మములం బరికించి ధాత్రి కే
తెంచును గుక్క' యంచు నలు
దిక్కుల వారలు కొన్నినాళ్ళు వీ
క్షించి, హతాశులయ్యు ధృతి
చేవఁ దొలంగక, తొల్లియట్లె పం
పించిరి రెండు మూఁడు గ్రహ
వేధులఁ గ్రమ్మరఁ బాకశాసనా 125

మీరున్ దానవులల్లనాఁ డొకటియై-
మేర్వాది మంథానులై
క్షీరాంభోధి మథించు వేళ జనియిం
చెం గాదె కాకోల, మా
తీరున్ జ్ఞప్తికిఁ దెచ్చె రాకెటులు ధా
త్రిన్ వీడుచో ధూమముల్:
కారుంజీఁకటి గ్రమ్మె నల్గడల, మే
న్గంపించె నా కత్తఱిన్. 126

ద్యావాభూములు దద్దరిల్లఁగ దిగం
   తవ్యాప్తమైనట్టి యా
రావం బొక్కటి యుప్పతిల్లె నచటన్
   బ్రహ్మాండమే బ్రద్దలై
పోవంబోలు నటంచు భీతిగొని ప
   ర్వ్వల్ వెట్టితిన్ : ప్రాణముల్
తాపుల్ దప్పెను మూర్ఛవచ్చెఁ దనువుం
   డస్సెన్ శ్రమం బయ్యెడున్. 127

'ఊపి రుండెనేని ఉప్పమ్ముకొనియైన
బ్రతుకవచ్చు' ననెడు పలుకు లెంచి
తుహినశృంగ మేగి, మహతీ కుసుమమాలి
కల గ్రహించి, యూర్ధ్వగామి నైతి. 128

మధ్యేమార్గమునన్ మనోజవమునన్
   బర్వెత్తుచున్నట్టి నేన్
నిధ్యానించితి నంతరిక్షపదవిన్
   నీహారరుఙ్మండలం
బధ్యాసింపఁగ రాకెట్టుల్ సలుపు య
   త్నారంభముల్ : వాసవా !
విద్యుద్దిష్టము లేమొ మానవులు జా
   బిల్లిం బ్రవేశించుటల్. 129

శ్వానము నంప కిష్ఠు తెగు
వం గొని వచ్చుచు నున్నవారయా
మానవులే స్వయంబుగ హి
మద్యుతి ముట్టడి సేయఁ, దొల్లిచం
దాన నశించు వారి జత
నంబు లనం దగదయ్య ! యెద్దియో
ధ్యానము వింటి నంటివె, ని
దానము దాని కిదే పురందరా! 130

మును వేదోయొక తప్పుసేసె నని సో
మున్ మీ రుపేక్షింపఁగాఁ
జన : దీనాఁ డతనిన్ జయించిన నహుల్
స్వర్గంబుపై దాఁడికిన్
వెనుదీఁబోరు: బృహస్పతీ! అపుడు గో
విందుండు నీవిందుఁడున్
దన చక్రాయుధమెత్తి వచ్చినను, త
థ్యం బద్ది వ్యర్థంబగున్." 131

* * *

అని నారదుండు పల్కిన
విని వేల్పులు బిక్కమొగము వెట్టి యొకఁ డొరున్
గనుగొని 'కిం కర్తవ్య'
మ్మని మిన్నక యుండఁ, గిన్నరాధిపుఁ డనియెన్. 132

"ఊరక చంద్రమండలము
నుర్వినివాసులు ముట్టడింపఁగా
రారు, తలంపఁగాఁ దుహిన
రశ్మికి వారల కెన్నఁడేనియున్
వైరము లేదు, దేనికయి
వచ్చిన వారో యెఱింగి వారి యా
కోరికఁ దీర్తు మేని సమ
కూరు శుభంబులు నాకకోటికిన్. 133

ధనమున్ గోరిర యేన్ నరుల్, నవనిధి
ద్రవ్యంబు లీవచ్చు, స్త్రీ
జనమున్ గోరిర యేని వారలకునై
స్వర్వేశ్యలం దొక్కతెన్
బనుపన్ వచ్చును, గాక యింక నెదియేన్
వాంఛించిరేన్ గామధు
క్కును జింతామణి పారిజాతములు గ
ల్గుం గాదె వజ్రాయుధా! 134

కలకాలంబు నిశీథినీచరులతోఁ
గయ్యంబు గావించుచోఁ
గలతం జెందని నాకె, నారదుని వా
క్యంబుల్ విన్ మేను గం

పిలు : సామాన్యులు గారు మానవులు: గా
వింపన్ దగున్ సంధియే:
బలవద్వైరము కీడుఁ దెచ్చును, దలం
పన్ రాదు పోరాటముల్." 135

శ్రీదుని పల్కులు విని, యాఁ
గాదనక మహేంద్రుఁ డుండఁగాఁ, గన్గొనలన్
మేదుర రక్తద్యుతు లు
త్పాదిల్లఁగఁ బల్కె దండధరుఁ డీ రీతిన్. 136

"కండల్ క్రొవ్వి నరాధముల్ దివికి సం
గ్రామార్థులై వచ్చిరేన్
ముండంబుల్ తెగఁగొట్టి తుండముల సం
భోభృత్ప్రతిన్ గండభే
రుండోదగ్ర నఖాగ్ర లగ్నములు గా
అవ్వంగ లేకున్న, ఈ
దండం బేటికి? పాశమేటికి? కృతాం
తఖ్యాతి నా కేటికిన్? 137

బొక్కసంబులోని రొక్కం బొసఁగియైన
గొండ్లికత్తియలను గూర్చియైన
సిగ్గుమాలి సంధిసేయుట మేలనెఁ
బిత్తికిపంద యీ కుబేరుఁ డకట!" 138

ఈ రీతిఁ దన్ను శమనుఁడు
భీరుం డనఁ, గినియుచుం గుబేరుండు సభా
గారంబు విడిచి పోఁబో,
వారల వారించి పల్కె వరుణుం డిట్టుల్. 139

"యమధర్మరాజ! నీ ధై
ర్యము శౌర్యము సాహసంబు లభినందనయో
గ్యము లే! గానీ, మన కిది
సమయము గాదయ్య పోరు సాగింపంగా౯. 140

గతకాలంబున సంయమీంద్రులు జగ
త్కల్యాణ సంధాన దీ
క్షితులై భూరితపఃప్రభావమున నా
ర్జింపంగ నైనట్టి య
ద్భుత సంకల్ప వికల్ప మానసిక శ
క్తుల్ కొన్ని ధీయుక్తి సా
ధితముల్ సుమ్మి మనుష్యమాత్రులకు ధా
త్రిన్ నేఁడు వైవస్వతా! 141

కానీ, దుర్మదులైన వా రిపుడు వి
జ్ఞానంబునన్ మృత్యుజి
హ్వానైర్ఘృణ్య మహాభయంకరములై
యావన్మహీలోక జీ

వానీకంబు లయింపఁ జాలు పరమా
ణ్వస్త్రాలు సాధించి, 'నీ
వా! నేనా!' యని తత్ప్రయోగములకై
యత్నించు వా రక్కటా! 142

ముల్లోకంబులు తల్లడిల్లఁగఁ దపం
బున్ జేసి, యేతత్తపో
వాల్లభ్యాత్త సమస్త శక్తులను గ్ర
హ్యాదుల్ సుపర్వావళిన్
ద్రెల్లింపన్ సమకట్టి, తామె విపద
బ్ధిం గ్రుంగి రూపాఱరే!
చెల్లున్ శాంతమె, దుష్టవర్తనులు వా
సిం గాంచ రెప్పట్టునన్. 143

కమఠ పాఠీన నక్ర కర్కట తిమింగి
లములు కాపుండు నా నిలయమును జొచ్చి
గుట్టు చిట్టాడుదురు నరుల్ పట్టఁబట్టి
అలిగి యుఱ్ఱింకు లింకింప నైనఁ గలరు. 144

దినముల్ మంచివిగాని యిప్డు భుజశ
క్తిన్ నమ్మి, యేమాత్రపున్
మొనగాం డ్రీ నరులంచు వారి పయికిన్
బోరాడఁగాఁ బోయినన్

మనమే గెల్తుమొ, గెల్చు వారలదో, సం
భావింపఁగా లేము–కా
వునఁ, గయ్యంబులు మాని సంధి విషయం
బుల్ చూచుకోఁగాఁ దగున్. 145

నాకుం దోఁచిన మాట సెప్పితి మహేం
ద్రా! పిమ్మటన్ నీవె కా
ర్యాకార్యంబులు నిర్ణయింపు" మనియెన్
యాదోనిధీశుండు–'శ
క్రా! కీడెంచియె మేలు నెంచవలెఁ గా
ర్యారంభ మం దంటిఁ గా
నీ, కయ్యాలకు జంకువాఁ డిచట లే
నే లేఁ' డనెన్ శ్రీదుఁడున్. 146

"ఇలబిల యమ వరుణ వాక్యాలు వింటి
జ్వలన పవమాన నైరృతేశాను లార!
మీ యభిప్రాయముం దెల్పుఁడీ!" యటంచు
వారలం గాంచి పల్కెను వాసవుండు. 147

"ధనద వరుణులు సంధి మేలనిరి, మీఁదు
వాలకము నట్టిదే యని తేలుచుండె:
నలువురన్ ముప్వు రొక త్రోవ నడచి పోద
మనఁగ, వారలతోఁ జేరు టర్హము గద. 148

నాలుగు దిక్కుల నేలం
జాలిన మీయంతవారె సంధియొనర్పన్
మే లనఁగఁ, గాదనంగా
మూలలఁ బడియుండు మమ్ము బోంట్లకుఁ దగునే!" 149

దిక్కోణపతులు పల్కిన
వాక్కులు విని దండధరుఁడు వజ్రి మొగంబై
దృక్కోణంబుల నిప్పులు
గ్రక్కుచు పలికెన్ సదస్యగణ మదిరిపడన్. 150

"పిఱికిపందలార! నరులకు భయపడి
మొగము వ్రేలవైచి తగవుమాలి
సంధియే సమంజసం బందురే! మీకు
సిగ్గులేదె యొక్క చిటికెడైన! 151

మర్త్యులకె యింతగా భయంపడుదురేని
మెదలకుండుఁడు మీరు మీ సదనములనె
కింకరులఁ బంపి కాళులు కేళ్లు కట్టి
యీడ్చి తెప్పింతు వారల నిచటి కిపుడె." 152

దండధరుఁ డిట్లు పల్కి సుధర్మ నుండి
వెడలి పోఁబోవుచుండఁగా, వేల్పుఱేఁడు
విన్నఁదన మానసంబున విస్తరింపఁ
బలుతెఱంగుల బతిమాలి పలికె నిట్లు. 153

"అంతక! మే మెఱుంగని వ
టయ్యె భవద్భుజదండపాశవి
క్రాంతులు! సంధికంటె బవ
రంబున కే ములుసూవు చుండె నీ
స్వాంతము, మానవుల్ నిఖిల
శాస్త్ర నిధుల్ సమరాంగణాగ్ర దు
ర్దాంతు లటంచు వింటిమి గ
దా యిపుడే మునిరాణ్ముఖంబునన్. 154

కావున సంధిసేయుటయె
కార్యమొ, కయ్యమొనర్చుటే హితం
బో, వివరించి చెప్పుటకు
నోపిన యీ పరమేష్ఠినందనుం
డే విధిఁ బల్కునో, యటులె
యెల్లరమున్ మెలఁగం దగున్, వివా
దావధి దాఁటె నట్టివి మ
హాత్ములనిర్ణయముల్ శుభంయువుల్." 155

అని బలారాతి పల్కఁగా విని యముండు
కొంత శాంతించి కొలువులోఁ గూరుచుండె:
నారదుని నిర్ణయము వినఁ గోరి మాఱు
మాట వచియింపరైరి ముక్కోటి సురలు. 156

"తీర్పరిగ నెన్నుకొనఁ బడితిని, సెబాసు!
దండిగా నిన్ని నాళ్లకుఁ దిండి దొరకె"
ననుచు లోలోన సంతస మంది, వెలికి
దిగులుపడు చున్న యట్లు తోఁపఁగ నటించి, 157

కన్నుఁగవ చెమ్మగిలి నట్లు గానిపింప
నెల్గు రాల్పడిన వితమ్ము నెఱుకపడఁగ
మాటమాటకుఁ గడుఁ దడఁబాటు గదుర
నప్పుడీ ట్లనియెను గలహాశనుండు. 158

"త్రిదశగురువరేణ్య! దిగధీశులార! ము
క్కోటి వేల్పులార! యేటికోళ్లు -
కార్యనిర్ణయాధికార గౌరవము నా
కబ్బె నె మ్మటంచు నుబ్బిపోను. 159

రాజ్యసభలందుఁ జర్చకు రాఁ గలట్టి
యితర విషయాలలో సభ్యు లెన్ని గతుల
వ్యవహరించినఁ జెల్లు; నే వంక నిల్చి
చేతు లెత్తిన నదియును జెల్లుఁ గాక. 160

'అన్యలోకవాసు లాత్మీయలోకంబు
నాక్రమించుకొనుట' యనెడు నిట్టి
విషయమందుఁ దగ దభిప్రాయభేదంబు;
వ్యక్తినిర్ణయ ప్రసక్తి లేదు. 161

అత్యంతీను లహమ్మతుల్ మనుజుల
త్యర్థప్రయత్నంబుతోఁ
బ్రత్యూహంబులు రూపుమాపుకొనుచున్
బ్రాలేయరుఙ్మండల
ప్రత్యాశామతులై భయంకరముగా
రాకెట్లలో వచ్చుటల్
ప్రత్యక్షంబుగఁ జూచి వచ్చితిని ద్యా
వాభూమి మధ్యంబునన్. 162

జైవాత్మకలోకంబున
కీవేళకె చేరియుండునేమో రాకె?
ట్లా వెనుక నాకవిజిగీ
షావేశను లూరకుందురా యేమి నరుల్? 163

పరమాణుశస్త్రనిధులగు
నరులన్ డీకొనఁగ, మీకు నాకేగా దా
హరిహరపితామహులకుం
దరమా? యుద్ధప్రసక్తి తగునా మనకున్? 164

పరలోక దురాక్రమణ
స్థిరనిశ్చాయకులు, సంధిసేఁతకు విముఖుల్
పరిపంథులు: మీరలు సం
గరమున వారిన్ జయింపఁగా లేరు సుమా, 165

సంధివిగ్రహాములు సఫలముల్ గానప్డు
మిగిలియున్న వింక మిత్రలాభ
మిత్రభేదములె సుమీ, తత్ప్రయోగంబె
తగును, నేను సూత్రధారి నగుదు. 166

అవనిమండలమున వివిధఖండములలో
బహుళ రాజకీయ పక్షములును
బలు తెఱంగులైన పరిపాలన విధాన
ములును గలవు నేఁటి కలియుగమున. 167

పోత్తుగుదురక సూత్రాణములను నడపి
హద్దుపద్దులు మీఱి కయ్యా లొనర్పఁ
గాలుదువ్వుచు నున్నారు నేలమీఁద
వెర వెఱిఁగి రెచ్చగొట్టెద నరుల నిపుడె. 168

అంతఃకలహము రేకె
త్తింతును బ్రాక్పశ్చిమక్షితిస్వామ్యములన్
మంతుగల ఖండములను బ
రంతపములుగా నొనర్తుఁ బ్రజ్ఞానిధినై. 169

పరమాణ్వస్త్రంబుల నొం
డొరులపయిన్ మానుసులె ప్రయోగించుకొనం
దొరకొను వెర వొనరింతును
మరణింతురు మిగులకుండ మహి నొక్కండున్. 170

అంతటితో గ్రహవేధుల
రం తడఁగును భూనభోఽంతరాళాధ్వమునన్,
జింతాశల్యాపగమ
స్వాంతులమై యుండఁ గలము స్వారాజ్యమునన్. 171

ధరణి కరిగి నా పనులను
నెఱవేఱిచి తిరిగివత్తు నే నిచ్చటికిన్
మఱియొక్కటి యీ లోపల
సురలారా! చేయవలయుఁ జుమ్మీ మీరల్. 172

అదియే మనియెదరా? చె
ప్పెదను వినుఁడు: రాక్షసులను బ్రేరింపుఁడు 'దు
ర్మదులగు నరాధములతోఁ
గదన మొనర్చుట యవశ్యకార్యం' బనుచున్. 173

'పూర్వదేవు లిరు, గీర్వాణులము మేము
మన విరోధములను మఱచిపోయి
యేకమై నరాళి డీకొన వలె' నని
చెలిమి నటనసేయ వలయు మీరు. 174

'మానవుల దురాక్రమణ ముభయులకును
ముప్పు దెచ్చు' నంచు బూమెలాడుఁ
దనము మెఱయఁ బల్కి, దనుజ సైన్యములను
బోరి కంపవలయు భూమిపైకి. 175

రక్కసుల యుక్కుమీఱిన రాణువాలు
చివ్వలో మనకడఁ బ్రదర్శించుచున్న
శాంబరీవిద్య నొక్కటే 'బాంబు' ప్రేల్చి
హత మొనర్తురు మానవుల్ క్షితితలమున. 176

ఒక్కటే యేటునకు రెండు పక్కులట్లు
దానవులు మానవులు నొకే తంత్రమునకు
మరణపైశాచికాస్య గహ్వరమునందుఁ
గూలి సమయుదు రేకైక కాలమందు. 177

స్వార్థరతి వైరినిహతి యోచనల నెల్ల
మాటలాడెడు నేర్పులో మాటుపఱిచి
సమరసన్నాహములు లేక, శ్రమయు లేక
హాయిగా నుండఁగలము విహాయసమున. 178

ఇఁక నే నేగెద ధరణికి
నకుతోభయులై మెలంగ నగు మీరును: జె
ల్మికలిమి నటించి, బవరము
నకుఁ బంపుఁడు నరులపైకి నక్తంచరులన్." 179

అని కలహాశనుం డనియె,
నౌనని మిన్నకయుండి రెల్లరున్.
దన చిరకాలవాంఛితము
నాఁటికిఁ దీఱె నటంచు నుబ్బిపో

యెనుబరమేష్ఠి సూనుఁడు, వ
హీవలయోచితమైన యట్లు మా
ర్చెను దన వేషభాషలను
జెచ్చెర నెల్లరు నబ్బురం పడఁగ, 180

ముడికిఁ దారిచి యున్న జడలు కర్తితములై
సురలు మున్నెఱుఁగని సరణి నమరె
గండుతుమ్మెదల ఱెక్కల యట్లు సంస్కృత
శ్మశ్రువుల్ మూతికి నవురు గూర్చె
మొలనుండి చీలమండలదాఁక కాళ్లపై
రవణిల్లె నలువగొట్టాలు రెండు
సాఁగి వ్రేలాడె నజాగళస్తన మట్లు
గుడ్డపేలిక యొండు గొంతు నంటి

చేతి వ్రేళ్ల నడుమ సిగరెట్టు నిలిచెను
మహతి బుజము మీఁద మాయ మయ్యె
మాఱువేస మూని నారదుం డిట్లు బృ
హస్పతికి నమించి యనియె నప్పుడు, 181

"సమరోద్రిక్తులు భూనివాసులు దురా
శాపీడితస్వాంతులై
తమలోఁ దామె పెనంగి శస్త్రహతులై
తారాపథం బంటు య

త్నములన్ మానుకొనంగఁ జేయుటకు నా
ధాత్రీప్రయాణం బిదే!
అమరాచార్య! నమస్కరింతు భవదీ
యాశీర్వచఃప్రాప్తికై." 182

అంతదనుక మాటలాడకుండిన యాంగి
రసుఁడు నారదుని తెఱం గెఱింగి
భువనములకుఁ గలుగఁ బోవు హోవడి నెంచి
మౌనివర్యు నిట్లు మందలించె. 183

"ముండితమస్తకంబులకుఁ
బూనికతో నెటులైనఁ దామ్రచూ
డాండము లంటఁగట్టఁ గల
యంతటి నేర్పరి వైన నీకు, భూ
మండలవాసు లొండొరుల
మార్కొనఁ జేయు టదెంత! మౌనిమా
త్రుండవె నీవు! వేల్పులకుఁ
గ్రొత్తలె నీ ప్రతిభావిశేషముల్! 184

'రాకెట్లిచ్చటి కేగుదెంచు సురలా
రా' యంటివే నారదా!
నాకప్రాప్తికి మానవుల్ సల్పు స
న్నాహంబులే మైనచో

మాకుఁ వారలతోడఁ గయ్య మొనరిం
పం బోవఁగా నేల ? సు
శ్లోకుల్ సత్పథవర్తనుల్ నరులు స్వ
ర్లోకంబు రాకుందురే. 185

అనసూయు లహింసావ
ర్తనులు ప్రజాక్షేమకరులు ధర్మజ్ఞులు స
జ్జనులు యశఃకాయులుగా
మనుజులు త్రిదశాలయమున మనవచ్చుఁ గదా. 186

అట్లుగాక దుష్టులై దయారహితులై
స్వార్థకాములై ప్రజాహితంబు
విస్మరింతురేని వీణామునీంద్ర ! మా
నవులు పోవఁగలరు నరకమునకె. 187

'అణుమర్మజ్ఞు లపూర్వయంత్రపరివా
రాభీలసేనాధిపుల్
రణదుర్ధర్షు' లటంచు మానవుల ధై
ర్య స్థైర్య సంపత్తినే
ప్రణుతింపం బని యేమి ? పంచజను - ల
ల్పాయుష్కు - లే యంత్ర నై
పుణితోఁ జేరఁగలారు స్వర్గమునకుఁ
మూర్ఖుల్ దురాశాపరుల్ ? 188

అంతరిక్షరహస్యంబు లరయఁ గోరి
యక్కటిగ మేది పంపిరే కుక్క నకట !
రాకెటులలో బయల్వేటి నాకమునకు
జీవహింసాపరాయణుల్ చేరఁ గలరె ? 189

లోకమాన్య మహాత్ములై నాకమునకు
వచ్చిరేని స్వాగతము చెప్పవచ్చు మనము
కాక దుర్మార్గులై దురాక్రమణమునకుఁ
దరలివచ్చినఁ బోదురు నిరయమునకు. 190

బొంది వీడి ప్రాణములు పోవకుండ ని
ల్పంగలేని శాస్త్రపారగులకు
వెఱచి, యేల మిత్రభేదంబు గావింప
నీవు పోవలెన్ మునిప్రకాండ ? 191

ఉర్వి కేగనెంచి యుబలాటపడు దేని
మంచిదే మునీంద్ర ! మానవులకు
జగడములను మాని శాంతిసంపదలతో
బ్రదుకు వెరవు నేర్పరాదె నీవు." 192

గురుఁ డిట్లు పల్కినంతనె
కరతాళధ్వనులు నాల్గుకడ లంటుచు మా
ర్మ్రోరసెను సభలో: 'ఇదియే
కరణీయం' బనిరి యష్టకాష్ఠాపతులున్. 193

నారదుఁ డిట్లనియెను "సుర
లారా! మీ తలఁపు లెట్టివానో తెలియం
గోరి యట్లు లంటిఁ గానీ!
పోరులు రేపంగ నేను భువి కరుగుదునే! 194

సర్వభూతదయయు సౌభ్రాత్రధర్మంబు
పాపభీతి దైవభక్తి ముక్తి
శాంతిసాత్త్వనై ప్రజాసంఘమునకు బో
ధింతు నేల నాల్గు దిక్కులందు." 195

అని నారదుఁ డనెను – 'తథా
స్త'ని మహాత్ము లనిరి వేల్పులందఱు – వీణా
ముని వారల వీడ్కొని వ
చ్చెను శుభసంధాత యగుచు క్షితితలమునకున్. 196

ఓం తత్సత్



